# మహావీర సూక్తులు





2500 నిర్వాణ సమారోహ సందర్భమున
ప్రచురితము




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాదు

285. మిత్రుడు, ధనము, కళత్రము, పుత్రుడు, బంధుబాంధవులు — వీరంతా సుఖం ఇచ్చేవారేకాక దుఃఖాన్ని కూడ కలిగిస్తుంటారు. కాని ధర్మం కేవలం సుఖాన్నే ఇస్తుంది.

286. ధర్మం వున్నచోట విజయం వుంది.

287. మానవుడు కర్మానుసారంగా అనుభవిస్తాడు. వరిగలు చల్లి వరిపంట కోయలేరు.

288. పుణ్యాత్ములు కాని ప్రాణులు దుఃఖిస్తుంటారు. వారు కోరుకున్న వస్తువు చేతికి వచ్చినా దక్కకుండా పోతుంది.

289. రాగద్వేషాలు లేకుండా శ్రమణధర్మాన్ని సాధించువారు శ్రేష్ఠులు.

290. సత్పురుషులకు ఆనందాన్ని కలిగించే కమనీయ కథను వినిపించు జీవి ఈ జన్మలోనే రెండు లోకాల సుకృతాన్ని పొందాడన్న మాట.

291. చేదుమందులాగే మిత్రుల పరుషవచనములు గ్రాహ్యములు.

292. విరోధికి లొంగిపోవడం కన్న ప్రాణత్యాగం శ్రేయస్కరం.

293. రాత్రిభోజనం అనేక దోషాలకు దారితీస్తుంది. కనుక చేయరాదు.

294. జీవితం విద్యుత్ మెరుపులా క్షణికమైంది.

295. ధర్మప్రాప్తి దుర్లభం.

296. సత్పురుషుల్ని తిరస్కరించిన ప్రాణులు మహానరకయాతనల పాలౌతారు.

297. అవివేకులు కష్టాలు పడతారు.

# మహావీర సూక్తులు

## I

1. అసత్యము చెప్పువాడు అందరి విశ్వాసాన్ని పోగొట్టుకుంటాడు. అందువల్ల అసత్యం ఆడటం మంచిది కాదు.

2. సన్మార్గాన నడిచే ఆత్మ స్నేహితుడిలాంటిది. దుర్మార్గాన నడిచే ఆత్మ శత్రువు లాంటిది.

3. వినయ విధేయతలు కలవాడు ఇహాపరాలు రెండింటిలోనూ మేలు పొందుతాడు.

4. అనాచారాన్ని అంటిపెట్టుకున్న ఆత్మ చేసినంతగావోని మన తల నరికే శత్రువు కూడా చేయడు.

5. ఆత్మద్వారా సత్యాన్ని అన్వేషించాలి. అన్ని జీవులపట్ల స్నేహ భావం ప్రదర్శించాలి.

6. దయ, కరుణ లేని శాస్త్రం, ఆచరణవల్ల ఏం ప్రయోజనం ?

7. కలహాన్ని పెంచేవిధంగాను అవతలవానికి అయిష్టాన్ని కలిగించే విధంగానూ మాటలు మాట్లాడని వ్యక్తి పూజ్యుడు.

8. ధైర్యం సడలనివారే "వృద్ధులు" అనిపించుకోడానికి అర్హులని పండితుల అభిప్రాయం.

9. కోపగించుకోనివాడు, నిజం పలికేవాడు, నిజమైన జ్ఞాని.

10. దేనివల్ల మేలు కలుగుతుందో దాన్ని ఆచరించు.

11. అజ్ఞానులు నిద్రపోతుంటారు. జ్ఞానులు నిత్యం మేల్కొని వుంటారు.

12. దురాశ రూపాన్ని తొడుక్కున్న పిశాచం; ఎలాంటి వ్యక్తినైనా చెడుత్రోవ పట్టిస్తుంది.

13. జ్ఞానాన్ని సంతరించుకున్న ప్రాణులు లోభం లేకుండా నిర్భయంగా వుంటారు.

14. అన్ని తత్వాలలోకెల్ల వుత్కృష్టమైంది ఆత్మతత్వం. దాన్ని నిశ్చయంగా తెలుసుకో.

15. ధర్మం పవిత్రమైన ఆత్మలో నివసిస్తుంది.

16. హింస పాపం. అన్ని మతాల్లోనూ దయ అనేది ప్రధానం,

17. ఏ ప్రాణినీ తిరస్కరించ కూడదు; దానిని నిందించరాదు.

18. మానవుడు ఏ ప్రాణినీ హింసించరాదు; ఇదే జ్ఞానం సారాంశం.

19. ధర్మానుసారం నడుచుకో. పాపానికి దూరంగా వుండు.

20. సత్యమే నిజమైన భగవంతుడు.

21. ప్రాణుల్ని రక్షించడమే ధర్మం.

22. మానసిక దాస్యం నుండి విముక్తి పొంది నడుచుకో.

23. పరాయివాని ఆస్తిని అపహరించుట నిజంగా అతని ప్రాణం తీయడమే.

24. సదాచారం లేని జ్ఞానం నిరర్థకం.

25. జ్ఞానాన్ని అనుసరించి ప్రవర్తించని వ్యక్తి జ్ఞానియైనా కూడా నిజానికి అజ్ఞానుడే.

26. సదాచారుడు, జ్ఞాని మరణ సమయంలో కూడా నిర్భయంగా వుంటారు.

27. మంచి పనుల పర్యవసానం మంచిగానే వుంటుంది.

28. విషయ విరక్తుడైన యోగియే ఆత్మజ్ఞానాన్ని పొందగలడు.

29. చేసేపనిని బట్టి దాని ఫలితం ఆధారపడి వుంటుంది.

30. సాధుపుంగవుల సాంగత్యం చేయుము.

31. భయానికి అతీతంగా వుంటూ దొరికిన దానితోనే సంతృప్తి చెందే నిష్కామయోగి ఎటువంటి పాపమూ చెయ్యడు.

32. కపటంవల్ల స్నేహానికి కీడు కలుగుతుంది.

33. జీవులకు అభయాన్ని ప్రసాదించు, వాటిపట్ల మైత్రితో ప్రవర్తించు.

34. క్రోధం పరస్పర స్నేహాన్ని తెంచేస్తుంది.

35. ఏ ప్రాణినీ హింసించకు.

36. భోగియైనవాడు జన్మమరణాల విషచక్రం నుండి తప్పించుకోలేడు. భోగికానివాడు వాటినుండి విముక్తుడు.

37. అన్ని ప్రాణులయెడ మిత్రత్వాన్ని కలిగివుండు.

38. అన్ని రకాల హింసనూ, సర్వసంగములను పరిత్యజించినవాడు సజ్జనులకు సైతం పూజనీయుడు.

39. కోరికల్ని తగ్గించుకో. అశాంతి తనంతట తానే తగ్గిపోతుంది.

40. పుణ్యాత్ముల కూటమి ఎన్నో మంచి పనులకు కారణమౌతుంది.

41. ధీరుడైనవాడు అరక్షణం కూడ పొరపాటు చేయరాదు.

42. నీ మనస్సును విషయ లోలత్వానికి దూరంగా వుంచు. అప్పుడే సర్వోత్కృష్ట సౌఖ్యాన్ని పొందగలవు.

43. తప్పులు చేసే వారికి నాలుగువైపుల నుండీ భయమే. తప్పులు చేయని వానికి ఎట్టి భయమూ లేదు.

44. సత్యంపట్ల అచంచలంగా వుండు.

45. అహం ఎక్కువ వున్నవ్యక్తి అందరి ద్వేషానికీ పాత్రుడౌతాడు.

46. లే -సోమరితనాన్ని విడిచి కర్తవ్య మార్గాన ముందుకు వెళ్లు.

47. ఆచారం లేని మానవజన్మ నిష్ఫలం.

48. ఇతరుల సుఖసౌఖ్యాలకోసం ప్రయత్నించేవానికి సుఖసౌఖ్యాలు వాటంతటవే అబ్బుతాయి.

49. దుఃఖం అంటే నీకు ఎంత అయిష్టమో ఇతరులకు కూడా అంతేనని భావించు.

50. ఎల్లప్పుడు అందరికి ప్రియమైన సత్యాన్నే పలుకు.

51. పరిగ్రహం ఫలితం క్లేశం.

52. పరిగ్రహం పట్ల అనాసక్తి కలిగిన వ్యక్తి స్వతంత్రుడు, నిర్భయుడు.

53 ఓర్పు, క్షమ వున్న వ్యక్తి వుత్తమ ధర్మాన్ని పాలిస్తాడు.

54. సరియైన శ్రద్ధలేని మనిషి నడుస్తున్న జీవచ్ఛవం.

55. ధర్మానికి మూలం దయ.

56. ప్రపంచానికీ ధర్మానికీ విరుద్ధంగా ఏ పనీ చేయరాదు.

57. జ్ఞానం —పడవనడిపే సరంగు. ధ్యానం - గాలి. ప్రవర్తన - పడవ. మూడింటి సమ్మేళనం ద్వారా జీవులు ప్రపంచ సాగరాన్ని దాటుతారు.

58. వినయంచే నిగ్రహం, తపం, జ్ఞానం సిద్ధిస్తాయి.

59. ఆత్మస్తుతి పరనింద పనికిరాదు.

# II

1. ఎవరైతే ఆత్మను ఆత్మరూపంలోనూ పరద్రవ్యాల్ని పరుల ద్రవ్యం గానూ తెలుసుకున్నారో అట్టి అక్షయజ్ఞాన సిద్ధులకు ప్రణామం.

2. వృక్షం అంతర్మథనంచేత అగ్నిరూపం తాల్చినట్లు మానవుడు ఆత్మోపాసనచేత పరమాత్మ అవుతాడు.

3. శాస్త్రములపట్ల శ్రద్ధయే అంటే సమ్యగ్దర్శనమే సర్వదుఃఖ హారిణియైన పరమౌషధం.

4. గ్రుడ్డివాడు గమ్యస్థానం చేరుకోలేడు. అలాగే సమ్యక్ శ్రద్ధా భావం లేనివాడు మోక్షం పొందజాలడు.

5. సమ్యక్ జ్ఞానం మానవుల అభీష్టాన్ని తీరుస్తుంది. జ్ఞాన విహీనమైన కర్మ ఎప్పటికీ అభీష్టాన్ని నెరవేర్చదు. మిథ్యాజ్ఞాని సత్కార్యంలో ప్రవృత్తుడైనా అభిలషించిన ఫలితానికి దూరంగానే వుంటాడు.

6. రాత్రి ఏ కొంచెం మిగిలివున్నా కొలనులోని తామరపూలు వికసించనట్లే ఆత్మలో ఏ కొద్దిభాగం మాయపొరతో కప్పబడి వున్నా మనస్సుకు జ్ఞానప్రబోధం కలుగదు.

7. సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం లేని సదాచారం ప్రయోజనకరంగా వుండజాలదు. గ్రుడ్డివాడు పరుగెత్తి పడిపోయినట్లుగా సమ్యక్ దర్శనం, సమ్యక్ జ్ఞానం లేని సదాచారం పతనానికే కారణ మౌతుంది.

8. ఆత్మకు మేలుచేయని సదాచారం నిష్ప్రయోజనం. ఆత్మకు జ్ఞానాన్ని ప్రసాదించలేని జ్ఞానం నిరర్థకం.

9. సూర్యుడు ఉదయించినా, చంద్రుడు ప్రకాశించినా, కోటిదీపాలు వెలిగించినా గ్రుడ్డివాడు చూడలేడు. అలాగే అజ్ఞానికి ఎటువంటి వ్యక్తి బోధచేసినా నిష్ఫలమే.

10. స్థావర జంగమ ప్రాణులకు పొరపాటున కూడా ప్రాణహాని కలిగించకుండా వుండడమే అహింసావ్రతం.

11. "అహింస" అనేది సర్వ ప్రాణులకు మేలుకోరే మాతృమూర్తి లాంటింది.

12. ప్రపంచం అనే ఎడారిలో అహింసయే అమృతవాహిని.

13. జననమరణవ్యాధిగ్రస్తులైన జీవులకు అహింసయే దివ్యౌషధం.

14. దుఃఖదావానలాన్ని అహింస వర్షించే మేఘంలా ఉపశమింప చేస్తుంది.

15. విఘ్నాలు తొలగించడానికి చేసే హింస విఘ్నాల్ని కలిగిస్తుంది. కులాచారంగా భావించిచేసే హింస ఆ కులాన్నే నాశనం చేస్తుంది.

16. ఎవరికీ అప్రియంగా వుండక అందరి శ్రేయస్సుకోరే పలుకే సత్య వచనం. అదే సత్యమహావ్రతం.

17. జ్ఞానులు సత్యచరితులైన మహాపురుషుల ధూళిచే ధరిత్రి పవిత్ర మవుతుంది.

18. సత్యవ్రత పాలనచేత హాస్యం, లోభం, భయం, క్రోధాన్ని త్యజించాలి. ఏమాటైనా మాట్లాడేముందు దాన్ని తరచి తరచి ఆలోచించాలి.

19. సత్యవాదులకు భయం లేదు.

20. ప్రాణం పోయినా సరే సత్యసంధులు అసత్యమాడరు.

21. ఏ మానవులైతే హితవాక్కులు చెప్తారో, వింటారో వారే మానవులు. మిగతా వారంతా మానవాకారంలో శిల్పి మలిచిన బొమ్మలు.

22. బుద్ధిమంతులైన వారి పలుకుల్లో తేడా వుండదు. వారి మాటలు పరస్పర విరుద్ధంగా వుండవు.

23. ఇతరులకు బాధ కలిగించే మాటలు సత్యాలైనా పలుకరాదు.

24. ఇవ్వని వస్తువుని తీసుకోకుండా వుండడం అస్తేయ మహావ్రతం. లౌకిక పదార్థాలు మానవులకు బాహ్యప్రాణాలు; వాటిని అపహరిస్తే వారి ప్రాణాల్ని హరించినట్లే.

25. అస్తేయ వ్రతాన్ని పాటించేవారికి అనర్థాలు (ఆపదలు) అరవైమైళ్ళ దూరాన వుంటాయి. ప్రపంచంలో వారికి ప్రశంస లభిస్తుంది. స్వర్గసుఖాలు లభిస్తాయి.

26. మనోవాక్కాయ కర్మలతో కాయభోగాల్ని స్వయంగా త్యజించడం, ఇతరులచే త్యజింప జేయడం, అలాచేసే వారిని ఆమోదించటం -యిదే "బ్రహ్మచర్య" మహావ్రతం.

27. బ్రహ్మచర్యాన్ని పాటించేవారు దీర్ఘాయుష్కులు, దృఢకాయులు, తేజోవంతులు, బలశాలులుగా వుంటారు.

28. బ్రహ్మచర్య వ్రతం సదాచారానికి ప్రాణం. మోక్షానికిచేరే తిరుగు లేని సాధనం. బ్రహ్మచర్యాన్ని పాటించేవాడు పూజ్యులకు కూడా పూజనీయుడు.

29. వాంతిచేసుకొన్న అన్నాన్ని తిరిగి భుజించనట్లే విజ్ఞులు ఒకసారి పరిత్యజించిన విషయవాంఛల్ని మరల గ్రహించడానికి ఇచ్ఛ గించరు.

30. విషాన్ని తినడం ఎన్నోరెట్లు నయం. అది ఒక్క గ్రుక్కతోనే మనిషిని హతమారుస్తుంది. (హతమూర్ఛకా పోవచ్చు). కాని విషయ వాంఛల్ని వరించడం ఏవిధంగానూ మంచిదికాదు. ఎందు కనగా అవి ప్రాణుల్ని రోజూ, చిత్రవధ చేస్తూ వుంటాయి.

31. పరిగ్రహ అనుష్ఠానాన్ని గట్టిగా పాటించుటకు, ప్రియమైనవీ అప్రియమైనవీ అగు శబ్దరూప రసగంధ స్పర్శ మొదలైన ఐంద్రిక విషయాల్లో ప్రీతి చూపకు. ద్వేషాన్ని వర్జించు.

32. పరిగ్రహం దుఃఖహేతువు. అది అసంతృప్తినీ అపనమ్మకాన్నీ పుట్టిస్తుంది. హింస అనే ఫలితాన్ని కలుగజేస్తుంది. కనుక పరి గ్రహ భావనను అదుపులో వుంచుకోవాలి.

33. హింసాది ప్రవృత్తులు జననాదిప్రాపంచిక విషయాలకు హేతువులు. ఆప్రవృత్తులన్నింటికీ హేతువు పరిగ్రహం. అందుచేత ఉపాసకుడు పరిగ్రహాన్ని సాధ్యమైనంత తక్కువ పాళ్ళలో వుంచుకోవాలి.

34. పరిగ్రహంలో ఆసక్తి వున్నంతవరకు ప్రాణుల్ని హింసించడం తప్పదు.

35. భవసాగరంలో ఎవరినైతే పరిగ్రహం అనే మొసలి పట్టుకుందో వారికి మోక్షం ఎలా సాధ్యం? వారి జీవితం ఏవిధంగా హాయిగా వుంటుంది? వారికి బుద్ధి కూడా ఎక్కడ నుంచి వస్తుంది?



36. అందరు ప్రాణులకు సౌఖ్యమంటే ఇష్టం; కష్టం అంటే అయిష్టం. ఇది తెలుసుకుని ఎల్లజీవుల పట్ల ఆత్మీయంగా వ్యవహారించు. కష్టాల్ని కొనితెచ్చే హింసను ఆచరించకు.



37. జీవి ప్రాణభయంలో రాజ్యాన్నీ యావత్తు సంపదనూ పోగొట్టుకోడానికి సిద్ధపడతాడు. ఇది అందరి జీవులలోనూ కనపడే సత్యం. జీవులకు ప్రీతికల ప్రాణాల్ని హతమార్చే వ్యక్తి భువినంతనూ దానం చేసినా శాంతించని పాపానికి కర్త అవుతాడు

38. సంతృప్తి అనే ఆభరణాన్ని ధరించిన వ్యక్తికి అన్నిరకాల నిక్షేపాలూ కరతలామలకాలు. కామధేనువు అతన్ని అనుసరిస్తుంది. దేవతలు అతనికి పరిచారకు లౌతారు.

39. పరిగ్రహించే కులాన్నీ పుట్టుకనీ పవిత్రం చేయువాడే నిజానికి పురుషు డనిపించుకుంటాడు. దీనికి విరుద్ధంగా ఎవరైతే అసత్యంగా వీరుణ్ని అనిపించుకుంటాడో అట్టివాడు ఈ పృథివిపై జన్మించకపోతే మంచిది.

40. అత్యంత రమణీయంగా గీచిన చిత్రంపై కాటుకపడితే దాని అందం అంతా చెడిపోతుంది. అలాగే మద్యపానంవల్ల మనిషి, తేజస్సు, కీర్తి ప్రతిష్ఠలు, బుద్ధి, ఐశ్వర్యం అన్నీ నష్టపోతాడు.

41. ఒక నిప్పురవ్వ గడ్డిపోచ లన్నింటిని కాల్చినట్లు మద్యం సేవించినందువల్ల వివేకం, నిగ్రహం, జ్ఞానం, సత్యం, పవిత్రత, దయ, ఓర్పు— అన్ని గుణాలు బుగ్గి అయిపోతాయి.

42. ఈ చైతన్య రూపం అయిన ఆత్మయే కర్మసాంగత్యంచే శరీరాన్ని ధరిస్తుంది. కాని ధ్యానం అనే అగ్నిలో ఆ కర్మలన్నీ కాలిపోగానే అది పరిశుద్ధమైన నిష్కళంక సిద్ధాత్మ (పరమాత్మ) అవుతుంది.

43. కాలిపోయిన గింజలోనుండి అంకురం మొలకెత్తదు. అలాగే కర్మాలు కాలిపోయినప్పుడు ఈ ప్రపంచానికి రాకపోకలన్నీ స్తంభించి పోతాయి.

44. కోటి జన్మాలు తపస్సు చేసినా నష్టపరచలేని కర్మబంధాన్ని సమతాభావాన్ని అవలంబించి అరక్షణంలో నష్టపరచవచ్చు.

45. ఎవరైతే మధ్యస్థంగా వుంటూ సమతాభావ విద్వాంసు లౌతారో వారు అడుగడుగునా ధైర్యాన్ని కలిగివుండి పూర్వాపర సంబంధాల్ని గమనిస్తూ పరిశుద్ధాశుద్ధ విచక్షణా శక్తితో తమ సిద్ధాంతాల్ని ప్రచారం చేస్తారు.

46. సుగుణాల్ని అధికంగా పొందినవాడు ప్రపంచంలో పూజింపబడే ప్రజలచే పూజింపబడుతాడు.

47. సుకృతంకల వ్యక్తి తీర్థంకరుల్ని భౌతికంగానూ భావరూపం లోనూ సేవించాలి.

48. చీకటిని పారద్రోలుతున్న సూర్యుని మాదిరిగా వున్న భగవంతుని ఆరాధించు.

49. త్రిలోకాల్లో వున్న జీవులకు వారి జీవితం ప్రియమైనదిగా ఉన్నట్లే అందరి జీవులయెడల అలాగే ఆలోచించు.

50. పరమాత్మయే నేను. నేనే పరమాత్మను. నన్ను నేనే ఆరాధించు కుంటాను. మరే ఇతర వస్తువుకూ ఆరాధించడానికి అర్హతలేదు. ఇదే నిజం.

51. ఆలోచన లేకుండాచేసే పనులు ఇహాలోకంలోను పరలోకంలోనూ సిద్ధించవు.

52. అన్యుల పదార్థాలతో ప్రమేయం పెట్టుకొని సంపాదించుకున్న సౌఖ్యం సౌఖ్యం కాదు. కాని స్వయంగా పరిశుద్ధ ఆత్మతో సంపాదించుకున్న సుఖమే నిత్యం, నాశనం లేనిది. అదే అన్ని సౌఖ్యాలకన్న మిన్నయైనది, నిజమైనదీ.

53. ఈ ప్రపంచంలో పుణ్యంవల్లనే సుఖం కలుగుతుంది. విత్తనం లేకుండా మొక్క అంకురించనట్లు పుణ్యం లేకుండా సుఖం మొలకెత్తదు.

54. పరిస్థితిని బట్టి వివేకాన్ని ప్రదర్శించడం అన్ని నీతుల్లో శ్రేష్ఠమైన నీతి.

55 సాధుపుంగవుల సాంగత్య ఫలితంగా పాపాలు దరిదాపులకు రావు. ఉత్కృష్టమైన అర్హత లభిస్తుంది. పుష్కలంగా మేలు కూడా జరుగుతుంది.

56. సమదృష్టి కలవాడై కలుషం మోహం లేని యోగిసాన్నిధ్యంలో పుట్టువిరోధులైన అడవిజంతువులుకూడా పరస్పర వైరభావాన్ని విడనాడతాయి.

57. సత్పురుషుల చర్యలు పరమశ్రేయో ప్రాప్తికోసమే కాని లౌకిక కార్యసిద్ధికోసం వుద్దేశించినట్టివి కావు.

58. త్రిలోకాల వృత్తాంతం విస్తారంగా తెలుసుకోవలసిన అగత్యంలేదు. దురాచారపరుడికి దుఃఖం, సదాచారసంపన్నుడికి సుఖం సంప్రాప్తమౌతా యన్నదే దాని సారాంశం.

59. ఓభగవానుడా, మీ యీ జైనతీర్థం అన్ని దుఃఖాల్ని నిర్మూలిస్తుంది. అదే తిరుగులేనట్టి సిద్ధాంతం. అదే అన్ని ప్రాణుల సంపూర్ణ అభ్యుదయాన్ని సాధిస్తుంది.

60. ఎన్నటికీ వాడిపోని ధర్మ మహావృక్షంపై వికసించిన దయా పుష్పాన్ని ధరించు. అదే మోక్షం అనే మహాఫలాన్ని ఇస్తుంది.

61. హింసయే ప్రపంచానికి మూలకారణం. దుఃఖాన్నే ప్రపంచం అంటాం.

62. సముద్రపు నీటిలో పడిన అమూల్యరత్నం ఎలా మళ్ళీ దొరకదో అలాగే మానవజన్మ నిష్ఫలమైతే తిరిగి ప్రాప్తించదు.

63. అన్ని బలాలలోకెల్ల తపోబలం శ్రేష్ఠమైనది.

64. కంటిలో నలుసును వుపేక్షించినా, అతిచిన్న శత్రువును వుపేక్షించినా అవి కష్టాలు తెచ్చిపెడతాయి.

65. హంసల మధ్య కాకి నప్పనట్లే విద్వాంసుల మధ్య మూర్ఖుడు రాణించడు.

66. అడుసుత్రొక్కి కాళ్ళు కడుక్కోవడంకన్న దానికి దూరంగా వుండడం శ్రేయస్కరం.

67. సద్బుద్ధి అన్ని సిద్ధుల్ని తెస్తుంది.

68. ఆత్మ, నశించే శరీరం మధ్య తేడా ఎరుగ లేనివాడు ఘోరతపస్సు చేసినా నిర్వాణాన్ని పొందలేడు.

69. భూతదయ కలవాడే తన క్షేమాన్ని చూచుకుంటాడు. ఋషి అయినా గృహస్థు అయినా అతనే వివేకవంతుడు. నిర్మల చిత్తుడు.

70. వుప్పునీటిని త్రాగిన దాహం తీరడానికి బదులు ఎలా ఎక్కువ అవుతుందో అలాగే విషయవాంఛల్ని తీర్చుచున్న కొద్ది వాటిపై తృష్ణ అంత పెరుగుతుంది.

71. నీరు తనంతట తాను వేడి కాజాలదు. అగ్ని సంపర్కం చేతనే దానిలో వేడిమి వస్తుంది అలాగే ఆత్మ స్వతహా పరిశుద్ధమైనది; ఆయినా కర్మ క్లేశానికి కారణం అవుతుంది.

72. బుద్ధిశాలురు కలలోకూడ అసత్యభాషణ చేయరు. వారి చర్యలు ఇతరులకు హాని కలిగించవు. వారి స్మృతి స్వప్నంలో కూడ ఇతరుల నాశనాన్ని తలపెట్టే విధంగా కర్కశంగా వుండదు.

73. పశువులకు మనుష్యులకూ మధ్య తేడా ఏమిటంటే పశువులు కర్తవ్యాకర్తవ్యాల్ని ఎరుగవు. మనుష్యులకా విచక్షణా శక్తి వుంది.

74. ఎవరి మనస్సనెడి నీరు రాగద్వేషాలనబడే కెరటాల తాకిడికి తట్టుకుని నిశ్చలంగా వుంటుందో అట్టి మనస్సే ఆత్మతత్వాన్ని చూడగలదు. ఇతర జనసామాన్యం దాన్ని చూడలేదు.

75. కాయంలో ప్రవేశించిన వృద్ధాప్యం,. శరీరంలో కెక్కిన మద్యం. రెండూ శరీరాన్ని నష్టపరుస్తాయి; వారి బుద్ధిని చెడగొడతాయి; వారి మాటల్లో అస్పష్టతను కలిగిస్తాయి.

76. ఇతరుల మనస్సును మంచిపనుల్లోకి మరల్చినవాడే నిజమైన ఆప్తుడు.

77. ఇతరుల మనసును భోగలాలసతవైపు ప్రేరేపించిన వాడే అసలైన శత్రువు.

78. పుట్టు అంధునికి అద్దం పనికిరానట్లే వ్యతిరేకబుద్ధి కలవానికి సత్ వచనములు నిరర్థకములు.

79. అడవిలో పూచిన పూలలా ఈ యవ్వనం వాడిపోతుంది. భోగ సంపత్తి విషపూరితమగు తీగెలాంటిది. జీవితం అశాశ్వత మైనది.

80. పరిగ్రహ సాంగత్యంవల్ల ప్రాణిలో రాగద్వేషాలు పుడతాయి. రాగంనుండి కామం పుడుతుంది. ద్వేషంవల్ల జీవులకు ఆఘాతం కలుగుతుంది.

81. తపస్సు, శాస్త్రపరిజ్ఞానం, కులం ఈ మూడు బ్రాహ్మణత్వానికి అవసరం. తపస్సు, శాస్త్రపరిజ్ఞానం లేని బ్రాహ్మణుడు కేవలం కులందృష్ట్యా మాత్రమే బ్రాహ్మణుడు.

82. ఏ కులమూ జాతీ గర్హనీయమైంది కాదు. సద్గుణాల వల్లనే సంక్షేమం కల్గుతుంది. అందుకే అన్నారు : చండాలుడైనా సరే అతను వ్రతధారి అయిన దేవబ్రాహ్మణుడని.

83. అంతరాత్మ సంకల్పమే పుణ్యానికి పాపానికీ కారణం.

84. పండిత జనులు సమదృష్టులు.

85. సమతాభావం లేకుండా ధ్యానం, ధ్యానం లేకుండా చెక్కుచెదరని సమతాభావం సిద్ధించవు. రెండూ ఒకదానికొకటి కారణభూతాలు.

86. ధర్మమే బంధువులు లేని వారికి బంధువు, అమిత్రులకు మిత్రుడు, అనాథులకు నాథుడు. ప్రపంచంలోని సమస్త ప్రాణికోటికి పితృ సమానమైనది.

87. దానము, పూజ, శీలము, పర్వదినం నాడు ఉపవాసము — నాలుగు రకాలు గృహస్థ ధర్మాలు.

88. జీవుడు తన కర్మానుసారంగా సుఖదుఃఖాల్ని అనుభవిస్తాడు. వాస్తవానికి ఎవరికి ఎవరూ మిత్రులు కారు.

89. మౌనం సర్వకార్యాల్ని సిద్ధింప చేస్తుంది.

90. లోహంతో తయారైన నావ సముద్రాన్ని తనూదాట లేదు. ఇతరుల్ని దాటించలేదు. అలాగే కర్మల బరువు క్రింద నలిగే వ్యక్తి సంసార సముద్రాన్ని తనూ దాటలేదు. ఎవ్వరినీ దాటించ లేదు.

91. జీవి ఒంటరిగా వచ్చాడు. ఒంటరిగానే ఆపదల్లో చిక్కుకుంటాడు. జన్మ జన్మాంతరాల్లో కూడబెట్టుకున్న కర్మ ఫలితాన్ని ఒంటరిగానే అనుభవిస్తాడు.

92. అంతరంగంలోను బహిరంగంలోనూ తపస్సనెడి అగ్నిని ప్రజ్వలింప జేసి నిగ్రహం కల వ్యక్తి కష్టాతికష్టమైన కర్మల్ని త్వరగా నాశనం చేస్తాడు.

93. శారీరకమూ మానసికమూ అయిన క్రోధమే క్లేశానికి హేతువు. క్రోధమే వైరానికి మూలం.

94. క్రోధాగ్నిని శమింప జేయడానికి శుభాత్ములు క్షమను ఓర్పును ఆసరాగా తీసుకోవాలి. అవే అతణ్ణి నిగ్రహం అనే ఉద్యానవనం వరకు చేరుస్తాయి.

95. శుభధ్యానం కామధేనువు.

96. వివేకం కల్గిన తర్వాత రౌద్రభావం వుండదు. అంటే వివేకవంతుడు ఎప్పుడూ క్రోధం చెందడు.

97. కపట పూరితమైన ఆచరణ దుర్గతి పట్టిస్తుంది. అది అవిద్యకు ఖని. శీలం అనే వృక్షాన్ని నరికివేసే గొడ్డలి. అసత్యానికి పుట్టిల్లు.

98. అన్ని పురుషార్థాలకు అడ్డం లోభం.

99. క్షమతో క్రోధాన్ని, మృదుత్వంతో అహంకారాన్ని, సరళత్వంతో మాయను, అనాసక్తితో లోభాన్ని జయించాలి. దుర్గుణాల విజయానికి సంబంధించిన వివేచనాసారం ఇదే.

100. మనస్సును నిరోధించ గలిగావంటే కర్మలు సంపూర్ణంగా వాటంతట అవే నిరోధించి పోతాయి.

101. రాగద్వేషాల్ని జయించడం ద్వారా మనఃశుద్ధి చేసుకోవాలి. మనస్సులోని కలుషాన్ని కడిగి వేసామంటే ఆత్మ పరిశుద్ధమౌతుంది. పరమాత్మను పొందుతుంది.

102. అమితానందకరమైన సమత అనెడి నీళ్ళలో స్నానం చేసేవారి రాగద్వేషాలనెడి మాలిన్యం చూస్తుండగానే తొలగి పోతుంది.

103. సమతాభావం కల సాధువుల ప్రభావంచేత ఒకరిపొడ మరొకరికి గిట్టని జంతువులుకూడా స్నేహబంధంలో కట్టుబడిపోతాయి.

104. శ్రద్ధానిష్ఠలేని వ్యక్తి ధర్మసాధన నిష్ఫలం.

105. చంద్రుడు అస్తమించిన వెన్నెల వుండదు

106. తపస్సుచేత అన్ని సిద్ధులు వస్తాయి

107. వ్రతపాలన సంసారదుఃఖాన్ని పోగొట్టుతుంది.

108. ఆక్రమణ బుద్ధిగల పనుగూ ఎప్పుడో ఒకప్పుడు వెనక్కు తగ్గవలసి వస్తుంది.

109. సమర్థులు చేసిన ఉపచారం వెంటనే సిద్ధిని ఇస్తుంది.

110. సిద్ధరసంతో కలిసిన ఇనుముకూడా బంగారంగా మారుతుంది,

111. భక్తిలోనూ స్నేహంలోనూ సజ్జనుల కర్తవ్యం ఒక్క మాదిరిగా వుంటుంది.

112. సజ్జనులు యాచకుల్ని వెనక్కు పంపరు. ఖచ్చితంగా ఇదే వారి వ్రతం.

113. వివేకవంతులు న్యాయబద్ధ మార్గాన్ని అవలంబిస్తారు.

114. సూర్యుడు భూమినుండి ఎంత నీటిని గ్రహిస్తాడో దానికన్న ఎక్కువగానే వర్ష రూపంలో భూమికి తిరిగి ఇస్తాడు.

115. రూపం, యవ్వనం, లక్ష్మిలాంటి అన్ని వస్తువులు క్షణికాలు. శాశ్వతమైనవి కావు.

116. మహాపరాక్రమవంతులైన వీరులకు సాధ్యంకానిది ఏది ?

117. అమృతం ఒక గుక్కైనా చాలు. విషం కడవడైనా పనికిరాదు.

118. ప్రమాణాల్ని చేరుకున్న పురుషులు నిర్మొగమాటంగా మాట్లాడతారు.

119. మహనీయుల ప్రతిజ్ఞలు తిరుగులేనివిగా వుంటాయి.

120. పండితజనులు ఆత్మశ్రేయస్సును అభిలషిస్తారు.

121. ఆపదలో ధర్మమే శరణ్యం.

122. బుద్ధిమంతులైన జీవుల ప్రవృత్తి ప్రయోజనకరంగా వుంటుంది.

123. పుట్టినవాడు గిట్టడం ఖాయం కాని ఎవ్వని జీవితం నిష్ఫలమో అట్టివానికే చావంటే భయం.

124. హేతుబద్ధంకాని మతాన్ని విడనాడాలి.

125. శాస్త్రాలనుండికానీ యుక్తినుండికానీ పుట్టిన అర్థాన్ని సానమీద రాసి అంగీకరించు. ఏ మతంపట్ల పక్షపాతం చూపించిన ఏమి ప్రయోజనం ?

126 భగవాన్ మహావీరుడంటే నాకు పక్షపాతంలేదు కపిలుడంటే నాకు ద్వేషమూ లేదు. కాని ఎవరి బోధన హేతుబద్ధంగావుంటే వారిదే స్వీకరించు. అదే నా వుద్దేశ్యం.

127. చెవులు వినడానికీ, నోరు మాట్లాడ్డానికీ, మెదడు ఆలోచనకూ ఏర్పడ్డాయి. అయినా శాస్త్రవిషయాల్ని ఏ వ్యక్తి చెవినిపెట్టి ఆలోచించడో అతడు ఏ విధంగా లాభకారి ?

128. అందరు మతబోధకులు తమకు తమకు అనుకూలంగా వుపదేశిస్తారు. కాని హృదయంవున్న వాళ్ళు ఆయా మతాల్ని శ్రద్ధగా పరీక్షించి అవలంబించాలి.

129. దుఃఖాక్రాంతుడు దుఃఖాక్రాంతుల మానసిక వేదనను అర్థం చేసుకుంటాడు.

130. అవకాశాన్ని ఎరిగివున్న సత్పురుషులు చివరికి దేన్ని వశం చేసుకోలేరు ?

131. ఆచార వ్యవహారంలో ఆలోచనాసరళిలో సామ్యంవున్న పురుషుల మధ్య మైత్రి త్వరగా అవుతుంది.

132 లాభంవల్ల లోభిత్వం పెరుగుతుంది.

133. గంగమీద అందరికీ అధికారంవుంది. అది ఏ ఒక్కరి పిత్రార్జితం కాదు.

134. వివేకవంతులైన పురుషులకు సమతస్థుడైన వ్యక్తి మినహా ఎవరు బంధువు లేరు.

135. పరస్పరం ఉపకారం చేసుకోవడం జీవుల కర్తవ్యం.

136. క్రోధం నాలుగు పురుషార్థాలకు-ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే వానికి-శత్రువు. అది కోపించువానికీ ఎదిటివ్యక్తికీ ఇద్దరికీ కీడు కలిగిస్తుంది.

137. క్రోధంవల్ల మిత్రుడు శత్రువుగా మారతాడు. ధర్మానికి హాని కలుగుతుంది. రాజ్యం పతనమౌతుంది. క్రోధం మూలాన ప్రాణాల్నిసైతం ఒదులుకోవాల్సి వస్తుంది.

138. ఆత్మ శరీరం రెండూ వేరన్న రహస్యం తెలియగానే ఎవరికైతే ఆహ్లాదసుఖం కలుగుతుందో అతనికి తపశ్చర్యవల్ల కలిగే కష్టాల వల్ల కూడా విచారం కలుగదు.

139. ఒక పెద్దవృక్షం నిలిచిందంటే దానికాధారం ఆ చెట్టువేరే. అలాగే తపస్సు నిల్వడానికి కారణం జ్ఞానం.

140. వ్యసనాలకులోనైన ప్రాణులకు తమ శ్రేయస్సును గురించి ఆలోచించే బుద్ధి వుండదు.

141. పళ్ళతో ఎముకను కొరుకుతూ కుక్క ఎలా ఆనందం అనుభవిస్తుందో, ఎవరి ఆత్మ విషయవాంఛలమోహంలో ఎలాపడి పోతుందో అలాగే మూర్ఖులు విషయవాంఛలు అనుభవిస్తూ దానిలోపడిన శ్రమనే సౌఖ్యం అని భావిస్తారు.

142. రాజు ధర్మాత్ముడైతే రాజుపాలించే ప్రజలుకూడా ధర్మాత్ములుగా వుంటారు. రాజు అధర్ముడైతే ప్రజలు అధర్ములౌతారు. యథా రాజా తథా ప్రజ అన్నది సిద్ధాంతం.

143. ఏ పరిపాలకుడు క్రోధం మొదలైన ఇంటిలోని శత్రువుల్ని

జయించ సమర్థుడు కాడో ఆత్మజ్ఞానంలేని ఆ వ్యక్తి కార్యం అకార్యం అని ఎలా తెలుస్తాడు ?

144 పృథివి పాలించు రాజులు సత్యమే చెబుతారు.

145. విద్యయే మనుష్యులకు శత్రువూ మిత్రుడూ. అదే వారికి మంగళ కారిణి. అది ఒక్కటే వెంటవచ్చే ధనం, అన్ని ప్రయోజనాల్ని సిద్ధింపజేసేది.

146. లౌకికాగ్ని కట్టెలు వుంటేనే మండుతుంది. కట్టెలు కాలిపోతే చల్లారిపోతుంది. కాని వ్యామోహం అనే అగ్ని కట్టెలు (విషయ వాంఛలు తీర్చుకొనుట) లేకపోయినా వున్నా మండుతూనే వుంటుంది.

147.. లోహం మంట తగిలినంత మాత్రాన వేడికాదు. అలాగే తేజో వంతుడైన మానవుడు కష్టాలు వచ్చినంత మాత్రాన లొంగిపోడు. అందువలన దౌర్జన్యం నిష్ప్రయోజనం. అదుపులో వుండే ఏనుగు మీదే అంకుశాన్ని ప్రయోగిస్తాం, కాని సింహం మీద కాదు.

148. విషయ వాంఛలతో గ్రుడ్డి అయిన వాడు అసలు గ్రుడ్డి వాడి కన్న ఘోరం. గ్రుడ్డివాడు కేవలం కళ్ళతో మాత్రం చూడలేడు. కాని విషయవాంఛల్లో గ్రుడ్డి అయిన వాడు మనస్సు మరి యితర అన్ని ఇంద్రియాలూ అన్నింటా చూడలేడు.

149. కొత్త మేఘంలోంచి పడిన ముత్యపు చినుకును గ్రోలిన చాతక పక్షి దాహంగావుండికూడ కొలనులోనినీళ్ళను ముట్టుకుంటుందా?

150. పరలోకాన్ని జయించాలని కోరుకునే వారికి సర్వోత్కృష్ట సాధనం ఓర్పు.

151. ధర్మానికి మూలం దయ. దయకు మూలం అహింస. పరిగ్రహం వున్న మనుష్యులు నిరంతరం హింసిస్తుంటారు.

152. ధర్మమే దుఃఖాలనుంచి రక్షిస్తుంది. ధర్మమే సుఖాన్ని విస్తరింప జేస్తుంది. ధర్మమే కర్మపాశంనుండి విముక్తి కలిగించి మోక్ష సుఖాన్ని ఇస్తుంది.

153. ఈ ప్రపంచంలో ధర్మం లేని స్వర్గం ఎక్కడ ? స్వర్గం లేని సౌఖ్యం ఎక్కడ ? కనుక సుఖాన్ని కోరుకునేవారు చిరకాలం ధర్మం అనే కల్పవృక్షాన్ని సేవిస్తూ వుండాలి.

154. ధర్మసంధతకల వ్యక్తి మేఘంలా అందరికీ వుపకారి.

155. కల్పవృక్షాన్ని సేవించిన వాడు ఎప్పుడైనా నిరాశ చెందాడా ?

156. ఎవరి భావన దోషం లేనిదో, ఎవరైతే దయాళువో, ఎవరైతే నిగ్రహం కలవారో వారి అరచేతుల్లో 'సుకృతి' నివసిస్తుంది.

157. పాలు నీరును వేరుచేసి హంస పాలను ఎలా త్రాగుతుందో అలాగే సత్పురుషులు గుణావగుణాల నుండి గుణాల్నే గ్రహిస్తారు.

158. వస్తువు గుణావగుణాలని తెలుసుకొని గుణాలను గ్రహించి, అవగుణాలను పరిత్యజించు వ్యక్తియే విద్వాంసులలోకెల్ల శ్రేష్ఠుడు.

159. ఆశ అనే లోతు గొయ్యిని ఏ నిధి కూడా పూడ్చలేదు. కాని స్వాభిమానం అనే ధనం దాన్ని పైవరకు ఇట్టే పూడ్చివేయ గలదు. కనుక స్వాభిమాన ధనమే అసలైన ధనం.

160. మహాపురుషుల హృదయాలు ఇతరుల ఔన్నత్యాన్ని చూపి

మాత్సర్యం లేకుండా ఉప్పొంగుతాయి. కాని క్షుద్రుల హృదయాలు వారి అభివృద్ధికి ఈర్ష్యతో కుంచించుక పోతాయి.

161. శక్తి సామర్థ్యం గల వారు చల్లగా కొద్దిగా మాట్లాడతారు.

162. తీర్థంకరులైన భగవాన్ ఎప్పుడూ పరుల సహాయాన్ని అపేక్షించరు. వారు స్వయంసాధన ద్వారా పరమాత్మ పదాన్ని పొందుతారు.

163. క్రోధం శాంతి సౌఖ్యాలకు అడ్డంకి లాంటిది.

164. దేశం, కాలం వీటిని గమనిస్తూ పనిచేయువారు ఎన్నడూ దుఃఖించరు.

165. మహాత్ములకు వ్యామోహం కలగదు.

166. మహనీయుల గుణసంపత్తి దానంతటదే ప్రకాశిస్తుంది.

167. ప్రపంచ సౌభాగ్యం కోసం మహాపురుషులు ఉద్భవిస్తారు.

168. కాలప్రవాహాన్ని తెలుసుకున్న బుద్ధిశాలురు ప్రపంచంలో కాళ్ళు చాచుకుని కూర్చోరు.

169. అవివేకి ఎప్పుడూ అసంతృప్తిగానే వుంటాడు.

170. ఇతరుల అభివృద్ధి చూచి దుర్జనులు అసూయ చెందుతారు.

171. ఆపత్తును నిర్మూలించలేని ధనం ధనం కాదు. తృష్ణను తుద ముట్టించలేని విషయవాంఛలు సుఖం కావు.

172. ఓడ లేకుండా సముద్రాన్ని దాటలేనట్లు గురువు ఉపదేశం లేకుండా సంసారసముద్రాన్ని దాటలేం.

73. తమ వాక్కు ద్వారా ధర్మరచనలు చేసేవారే ప్రపంచంలో కవులు, చతురులు.

74. విద్య యశస్సును ఇస్తుంది. విద్య శ్రేయస్సును కలుగ చేస్తుంది. విద్యాదేవిని బాగా ఆరాధించిన ఆమె అన్ని మనోరథాల్ని ఈడేరుస్తుంది.

.75. ఆత్మజ్ఞానులైన పురుషుల చిత్తము ఆత్మ సంక్షేమంలోనే అనురక్తమై వుంటుంది.

176. సజ్జనులు గుణాల్ని గ్రహిస్తారు.

177. ధర్మాత్ములు అవమర్యాదను సహించరు.

178. సరళస్వభావంకల వ్యక్తులు ఎవరి విషయంలోనూ శంకించరు.

179. మహాత్ములను సేవించువారు కోరిన ఫలాల్ని ఇచ్చే కల్పవృక్షం లాంటివారు.

180. సత్యదూరమైన భాషణవల్ల అల్పత్వం, నింద కలుగుతాయి.

181. మేధావులు ఇతరుల-వారు తమ విరోధులైనా సరే-తర్కబద్ధమైన మాటల్ని అంగీకరిస్తారు.

182. అన్ని గుర్తింపులలో కెల్ల స్వదేశాన్ని గుర్తించుట సర్వోత్కృష్టమైంది.

183. లోకకళ్యాణం కన్న ప్రాధాన్యం ధనానికి యివ్వరాదు.

184. పరుల ఆధీనంలో వున్నవారు సుఖసంపత్తిని పొందజాలరు.

185. మహాత్ముల సాంగత్యం కల్పవృక్షంలా ఫలదాయకంగా వుంటుంది.

186. ఏ వ్యక్తి అందరిపట్ల ప్రేమానురాగాలు ప్రదర్శించి అభయం ఇచ్చాడో అతడు ఏ తపస్సు చేయలేదు ? మహాత్ములకు ఏది దానం చేయలేదు ?

187. ఎవరి ధైర్యం సడలదో పండితుల దృష్టిలో వారే వృద్ధు లనిపించు కోడానికి అర్హులు.

188. దయలేని శాస్త్రం, ఆచరణ వలన ఏమిలాభం ?

189. ఏది నీహితవు అని తోస్తే దాన్ని ఆచరించు.

190. ఆత్మశ్రేయస్సులో ప్రవృత్తుడై సమతాభావం గల ఋషి సాన్నిధ్యంలో క్రూరమృగాలుకూడా శత్రుత్వాన్ని విడనాడతాయి.

191. ఆశారూపి పిశాచం ఎవరిని భ్రష్టుచేయలేదు ?

192. పాపం శత్రువు, ధర్మం మిత్రుడు అని నిశ్చయించుకుని ఆత్మ తత్వాన్ని తెలుసుకున్నవాడే ఖచ్చితంగా ఉత్తమ జ్ఞాని.

193. సమస్త మానవాళి ఒక జాతి.

194. ఏ లౌకిక ఆచరణలవల్ల 'సమ్యక్ త్వానికి' హాని కలుగదో, వ్రతాలకు భంగం వాటిల్లదో అవన్నీ జైనులకు ప్రమాణములే.

195. ధర్మం ఒక్కటే మిత్రునిలా మృత్యువుతర్వాత కూడా వెంట వస్తుంది. ధర్మం మినహా మిగతావన్నీ శరీరంతోపాటు నశిస్తాయి.

196. గురువులు, దేవతలు, బ్రాహ్మణులు, యతీశ్వరులు, తపస్సంపన్నులు, మహాత్ములు-వీరిని ప్రయత్నించి పూజించాలి.

197. ఇతరులకు రవంతైనా బాధ కలుగ జేయరాదు. అలాగే పరులకు ఉపకారం చేయడానిక్కూడా ప్రయత్నించాలి.

198. తమ చెడ్డపనులచేత తమ సర్వనాశనాన్ని కొనితెచ్చిపెట్టుకునే పాపాత్ముల యెడల దయాభావాన్ని ప్రదర్శించు. ఇదే ఉత్తమ ధర్మం.

199. అన్ని సుఖాలు ఆత్మకు వశమై వున్నాయి.

200. హితాహితాల్ని తెలుసుకునే విచక్షణ లేకుండా వర్తమానాన్ని చూసేవారే దుఃఖాక్రాంతు లౌతారు.

201. ధర్మమే శ్రేష్ఠమైన చింతామణి, దివ్యామృతం.

202. బంజరుభూమిలో నాటిన విత్తనం మొలకెత్తి పండ్లను ఎలా ఇవ్వదో అపాత్రునికి ఇచ్చిన సద్ధర్మము అనే విత్తనంకూడా ఏమీ ఫలితాన్ని ఇవ్వదు.

203. ఈ లోకం ఆదిలేనిది, నాశనంలేనిది.

204. మూఢాత్ముల ప్రపంచం దారాపుత్రుల రూపంలో వుంటుంది. కాని ప్రాపంచిక బంధనాల్లేని విద్వాంసుల ప్రపంచమే శాస్త్రం.

205. ప్రశస్తి తెచ్చే కార్యాల్ని అభ్యసించడం మినహా విద్వత్తు మరే ఫలితాన్ని ఇవ్వదు.

206. ఆరోగ్యం, వయస్సు, బలం, లక్ష్మి-ఇవన్నియూ అస్థిరాలే. కనుక వీటిని పొందినవారు వాటిని సత్కార్యాలకు వినియోగించి సద్వినియోగం చేయాలి.

207. గుణదోషాలపట్ల వేరువేరు దృక్పథాలతో చూడడంవలన ఈ ఆత్మ విషయవాంఛల యెడల ఆసక్తి ప్రదర్శిస్తూంది. కనుక ప్రాపంచిక భ్రమణం అంటే భయపడే మంచివారు సదాచారంవుందో లేదో పరిశీలించి ఆత్మను రక్షించుకోవాలి.

208. కాలం, స్థానం, మోతాదు, స్వభావం, భుజించే పదార్థ పరిమాణం, తాను జీర్ణించుకోగల శక్తిసామర్థ్యాల్ని గమనించి భోజనంచేయు వారికి ఏ ఔషధం అక్కర్లేదు.

209. పురుషులకు కులీనత్వం, రూపం, హక్కు యవ్వనం, ధనం, మైత్రి, ఐశ్వర్యం, సంపద-ఇవన్ని వుండికూడా వినయం, వైరాగ్యం లేక పోయినట్లయితే అవి నీళ్ళులేని నదిలా శోభించవు.

210. క్రోధం పరితాపాన్ని కలిగిస్తుంది. క్రోధం అంటే అందరికీ భయం. క్రోధం వైరాన్ని జనిస్తుంది. క్రోధం సద్గతికి విఘాతం కలిగిస్తుంది.

211. క్రోధంవలన ప్రీతి, అలుకవలన వినయం నశిస్తాయి. మాయాచరణ వలన విశ్వాసంపోతుంది. కాని లోభంవలన అన్ని సుగుణాలు నశిస్తాయి.

212. విషయవాంఛాలోలురైన జీవులు ఇహలోకానికీ పరలోకానికీ హితవు చూడరు.

213. మనుష్యుల యావత్తు సంపత్తి క్షణంలో మారుతుంది. అన్ని సంయోగాలు చివరకు వియోగంలో పరిణామంచెంది శోకాన్ని కలిగిస్తాయి.

214 శాస్త్రముల స్వాధ్యాయన ఆరంభం గురువుచేతిలోవుంది. అందుచేత ఎవరైతే తమ హితవు కోరుకుంటారో వారు గురుసేవకు అంకితం కావాలి.

215. కులం, జాతి ఆధారంగా మదించిన మానవులు ఈ లోకంలో ప్రేతాల్లా దుఃఖిస్తారు. పరలోకానికి వెళ్ళిన తర్వాత వారు నిమ్న జాతికి దిగజారిపోతారు.

216. మునియైనవాడు ఈ లోకంలోకానీ పరలోకంలోకానీ తనకూ ఇతరులకూ దుఃఖాన్నిచ్చే యే రకమైన ఆలోచన, వాక్కూ, చర్య చేయరాదు.

217. ఈ లోకంలో, తల్లి, తండ్రి, యజమాని, గురువు-వీరి ఉపకారాల్ని బదులు తీర్చడం చాలకష్టం. అందులో గురువు ఉపకారానికి ప్రత్యుపకారం చేయడం ఈ లోకంలోనూ ఆ లోకంలోనూ చాల అసాధ్యం.

218. ధర్మాధ్యయనంలో లీనమైవుండి ఆగమాలకు విరుద్ధమైన కార్యాల్ని త్యజించి, ఆత్మను అసత్ప్రవృత్తులనుండి కాపాడుతూ కామవికారాల్ని జయించిన సాధువు సుఖజీవి.

219. ధర్మానికి మూలం దయ. క్షమాశీలత లేనివాడు దయను ధరించ లేడు. అందువల్ల ధర్మంలో యే క్షమాశీలుడు నిమగ్నుడో అతడే ఉత్తమ ధర్మసాధన చేస్తాడు.

220. శ్రుతశీల సంపత్తి కల వినయశీలుడు భాసించినట్లు అనేక బహుమూల్య వస్త్రాల్నీ ఆభూషణాల్ని ధరించిన వ్యక్తి భాసించడు.

221. ఋజుత్వం లేకుండా పరిశుద్ధి కాదు. పరిశుద్ధంకాని ఆత్మ ధర్మాన్ని ఆరాధించలేదు. ధర్మంలేనిదే మోక్షం లభించదు. మోక్షానికి మించిన వేరే సుఖంలేదు.

222. త్రికరణశుద్ధిగా ఎవరైతే కామవాంఛల్ని జయించారో, పరలోక సద్గతులను ఆశించకుండా శాస్త్ర సమ్మతంగా ఆచరిస్తారో అట్టి వారికి ఇక్కడే మోక్షం లభిస్తుంది.

223. సంసార జంజాటాలు లేని సాధువుకు ఈ జన్మంలో లభించే సుఖం రాజరాజుకు ఇంద్రునికూడా లభించదు.

224. విషయవాంఛల్ని ఉపశమింపజేసిన వానికి, హాస్యం, రతి, అరతి, సుఖంలోను విచలితం కానివానికి, భయం నిందచే పరాజితుడు కాని వానికి లభించే సుఖం ఇతరులకు ఎలా సాధ్యం ?

225. కోటి జన్మలకు కూడా ప్రాప్తించని మానవజన్మ పొందిన నేను ఈ పొరపాటు ఎందుకు చేయడం ? సురాధిపుడైన ఇంద్రుడు కూడా గతించిన వయస్సును తిరిగి తేలేడు.

226. మాయాచారపరుడైన మనిషి ఎవరినీ ఏమి చేయలేడు. కాని తనలోవున్న దోషాలతో బాధపడుతూ సర్పంలా ఎవరికీ విశ్వాస పాత్రుడు కాలేడు.

227. జ్ఞానం, సత్ప్రవర్తన, తపస్సును పెంచుతూ దోషాల్ని తొలగించేది నిశ్చితంగా కల్యాణము. మిగిలినదంతా అకల్యాణము.

228. అన్నిరకాల విషయవాంఛల్ని తీర్చుకుంటూ సుఖాల్ని పొందే రాజుకన్న వాటిని త్యజించిన విరాగికి సహజంగానే ఆనందం అనంతకోటి రెట్లు ఎక్కువ.

229. గుర్రం తన శరీరంపై అలంకారాలున్నా వాటిపై మోజు పడదు. అలాగే విరాగి కూడా.

230. బురదలో పుట్టి బురదమధ్య వుంటూ తామర పువ్వు బురద అంటుకోకుండా వున్నట్లు ధర్మోపకరణాల్ని శరీరాన ధరించిన సాధువు దోషాల్ని అంటకుండా వుంటాడు.

231. రాగద్వేషాలతో నిండిన చిత్తమును ధర్మంవైపుకు మరల్చి దుఃఖా

న్నుంచి కాపాడే దాన్ని సత్పురుషులు శాస్త్రం అని వ్యవహ రిస్తారు

232. లక్షరెట్లు పెరిగిన దేవేంద్రుని వైభవంకూడ ఒక ఋషీశ్వరుడు సిద్ధించుకున్న బుద్ధితో తులతూగలేదు.

233. అన్ని నిగ్రహాలకు ఆధారం లోకం. అందువల్ల లోకవిరుద్ధం ధర్మ విరుద్ధం అయిన కార్యాలు చేయరాదు.

234. ... ... ...

235. శాస్త్రజ్ఞానం లేనిదే శ్రేయస్సు జరుగదు. వినయం లేనిదే శాస్త్ర జ్ఞానం రాదు. కనుక శాస్త్రజ్ఞానార్జన కోరేవారు వినయంతో వుండాలి.

236. శాస్త్రాధ్యయనం, అధ్యాపనం, ఆత్మచింతన, ధర్మోపదేశం— వీటిలో త్రికరణ శుద్ధిగా ప్రయత్నించాలి.

237. పౌర్ణిమ చంద్రునిలోని లేడి నల్లగా వుండి ప్రకాశమానం అయి నట్లు సజ్జనులు గ్రహించినది కొంచెమైనా ప్రకాశిస్తుంది.

238. అన్ని మదాలకు మూలాల్ని పెకలించకోరే మునులు ఆత్మస్తుతి చేయరాదు. పరనింద చేయరాదు

239. తనవాడు పరాయివాడన్న ఆలోచన వదలి ఆత్మజ్ఞాన చింతనలో లీనమై రాగద్వేషాల్ని జయించిన సాధువు ఆరోగ్యంగానూ వుంటాడు.

240. మహాపురుషులు దుఃఖార్తుల్ని కనికరించాలి.

241. ఆలోచన సాలోచన లేకుండా త్వరపడి కార్యములకు పూనుకునే వారు తర్వాత తప్పనిసరిగా పశ్చాత్తాపం చెందుతారు.

242. మేధస్సు లేనివారి దృష్టిలో 'ఇతను పురుషుడు', 'ఈమె స్త్రీ' అన్న భేదం వుంటుంది. కాని మేధావంతులు అందరి వచనాల్ని పురుషుడూ స్త్రీ అనే భేదం లేకుండా గ్రహిస్తారు.

243. అరణ్యాల్లో, సముద్రంలో, శత్రుప్రాంతంలో మనల్ని రక్షించేవి మనం ఆర్జించిన పుణ్యాలే కాని మరేవీ కావు.

244. ఏ మహాకార్యం చేయకుండా అర్థం లేకుండా గర్జించేవారు, తమ గొప్పల్ని చాటుకునేవారు శక్తిసంపన్నులైనా చిన్నవారి క్రిందే లెక్క.

245. ధర్మంచే సుఖం, అధర్మంచే దుఃఖం కలుగుతా యన్నది జగత్ప్రసిద్ధ విషయం.

246 ఆశాపాశంలో చిక్కుకున్న జీవులకు ధర్మబంధువే ముక్తి కలిగిస్తాడు.

247. పరిగ్రహం యాచన అంటే యోచనలేనివాడే ఋషి.

248. కాలమొక్కరీతిన ఉండబోదు. కట్టెలమ్మినచోట పూలమ్ముతారు. పూలమ్మిన చోటనే కట్టెలమ్ముతారు.

249. 'ఈపని ఇప్పుడు చేయాలి' 'ఈపని చేస్తాను' అంటూ ఆలోచనలో కాలహరణం చేయువాడు భయంకరమైన సముద్రంలో నౌక ప్రవేశించినట్లు దుర్బుద్ధి కాలం అనే దాని నోటిలో దూరుతాడు.

250. వ్రతం అనే నౌక సహాయంతో భవసాగరాన్ని దాటిన ఈ కర్మభూమిలో జన్మించిన వుత్తమ యువకులు ధన్యులు.

251. కార్యసిద్ధినే అందరు నీతికోవిదులు ఇష్టపూర్వకంగా అంగీకరించారు.

252. క్లేశసంపదను నాశనంచేసి, జనన మరణాల నుండి విముక్తి పొంది, లోకంలో అగ్ర పంక్తిలో వున్న సిద్ధాత్ముల స్థాయిని అందుకోవడమే అనుపమానమైన సుఖం.

253. మరణించిన ఏనుగు మెదడులోని మణి, దంతాల్ని ఒదిలి కాకులు దాని మాంసమే గ్రహించినట్లు దుష్టులు గుణదోషములు కలిసి వున్న చోటునుండి దోషాలనే గ్రహిస్తారు.

254. ఉత్తమ గుణవంతులు ధీశాలురు ఆత్మస్తుతి చేసుకోనరు.

255. సమ్యక్ జ్ఞానులు పుత్రపౌత్ర కళత్రాదులతో నిండిన సంసారమనే పంజరంలో బంధింపబడి వుండరు.

256. సజ్జనుని చరిత్ర నిర్దోషంగాను పరోపకారిగాను వుంటుంది.

257. జినునికి నమస్కారం చేయడంలాంటి మరో శుభకరమైన పనిలేదు

258. వేయి వ్యాధులకన్న మహావ్యాధి కామవాంఛ. అది మతిని చెడగొట్టుతుంది.

259. సస్యాల్లో వరి, వృక్షాల్లో చందనం, రాళ్ళల్లో రత్నాలు శ్రేష్ఠమైనట్లు జన్మల్లోకెల్ల మానవజన్మ సర్వోత్కృష్టమైంది.

260. నీ దుఃఖాన్ని సజ్జనునిముందు చెప్పుకున్నచో అది తొలగిపోతుంది.

261. ఏ వ్యక్తి తన గొప్పను తాను చాటడం ద్వారా గౌరవాన్ని పొందలేడు. అతని గుణగణాల గురించి ఇతరులు చెప్పుకొన్నప్పుడే అతని గొప్పతనం సార్థకం అవుతుంది.

262. గోటితో గీకగలిగినచోట గొడ్డలిని ప్రయోగించడం నిరర్థకం.

263. పుణ్యాత్ముల పేర్లు వినగానే జనులు శ్రద్ధాభక్తులతో తలవంచుతారు

264. దుర్బుద్ధి కలవానికి వందలకొలది తియ్యని మాటలు చెప్పి బుద్ధి తెప్పించే ప్రయత్నం దండుగ.

265. ఖచ్చితంగా లోతుపాతులు ఆలోచించి చేయుపని సుఖాన్ని ఇస్తుంది.

266. పనికిమాలినవారు నిందించినంత మాత్రాన పండితులు క్షోభ చెందరు. కుక్కలరచినంత మాత్రాన ఏనుగు ఎక్కడైనా తన దారి విడిచిపోతుందా ?

267. ఇతరులకు బాధ కలిగించే మాటలు చెప్పకుండా వుండటానికి ప్రయత్నించాలి. ఎందుకనగా అవి హింసను ప్రేరేపిస్తాయి. హింస అనేది సంసార బంధనాలకు కారణభూతం.

268. ఘోర విపత్తులో చిక్కుకున్న వారికి చేయూత యిచ్చి కాపాడు దయార్ద్రహృదయుల జన్మయే నిర్మలమైంది.

269. సత్పురుషులు ధర్మవిరుద్ధంగా ప్రవర్తించరు.

270. నిప్పంటుకుని యిల్లు కాలుతూంటే నీళ్ళకోసం చెరువు త్రవ్విన ఏం ప్రయోజనం ? పాము కాటు వేసిన తర్వాత విషాన్ని దించే మంత్రసిద్ధి కోసం ప్రయత్నిస్తే ఏమి లాభం ?

271. కీర్తి రూపంలో వున్న వధువును లోకనింద అనెడు బలి అపహరించెడి వారి జీవితం చావుతో సమానం.

272. శాంతస్వభావులై జైనశాసనాన్ని ఆశ్రయించండి.

273. తెలిసిన పదార్థాల గురించి కూడా మీ గురువులను అడిగి తెలుసుకొనండి. అలా చేసినచో దాని పరిణామం ఎంతో సుఖవంతంగా వుంటుంది.

274. ఇతరుల తప్పుల్ని కొంచెమైనా వెంటనే వెతికేవారు మేరుపర్వతంలా వున్న తమ తప్పుల్ని ఎందుకు చూడరు ?

275. అన్ని జన్మలకన్న మనుష్యజన్మ శ్రేష్ఠమైనది. అయినా ఈ జన్మలో ఆత్మ శ్రేయస్సు చేసుకోలేకపోతే మోసగింపబడ్డాడని అనుకో.

276. ఈ మూడు లోకాల్లో హితవు కోరుకునే, ప్రాణులకు ధర్మమే శరణ్యం. దానితోనే వారికి సుఖం లభించవచ్చు.

277. రాజు భయాక్రాంతులు దరిద్రులు పీడితులగు స్త్రీపురుషులకు అభయదాత.

278. కులీనులు నీచులను ఆశ్రయించి మనుగడ సాగించరు. ఎక్కడైన కొదమసింగములు గుంటనక్కల్ని ఆశ్రయిస్తాయా ?

279. మనుష్యజన్మ పొంది కూడా పుణ్యం సంపాదించని వాని చేతికి అమృతభాండము వచ్చినా అది పగిలిపోతుంది.

280. ప్రాణులకు అనిష్టం కలిగించేది అజ్ఞానం.

281. ధర్మానికి సాధ్యంకాని పని అంటూ లేదు.

282. నదులకు మూలస్థానాలు కొండలు అయినట్లే లోకమర్యాదను తీర్చి దిద్దువాడు రాజు అవుతాడు.

283. ఎంతో గర్విష్ఠులు శక్తి సంపన్నులు కూడ మహాత్ములకు వశీభూతులౌతారు.

284. మనుష్యయోనిలో సమ్యక్ జ్ఞానము సంపాదించదలచిన బుద్ధిశాలి జినుని తప్పక ఆశ్రయించవలెను.

298. జినేంద్రునికి నమస్కరించుటలాంటి మరో మంచి పనిలేదు.

299. మేఘంలేకుండా వాన, విత్తనం లేకుండా పంట వుండనట్లు ప్రాణులకు ధర్మబద్ధ ప్రవర్తన లేకుండా సుఖం ఎలా ?

300. సత్కథను కీర్తించు పెదవులే శ్రేష్ఠములు.

301. సజ్జనులు తియ్యగా మాట్లాడతారు. ఇది వారి కుల సంప్రదాయం.

302. సద్బుద్ధి కలవారు రోజూ ప్రాతఃకాలమునే లేచి తమ నైపుణ్యాన్ని గురించి పరిశీలన చేసుకోవాలి.

303. మనిషి అన్నవాడు ఆదరపురస్సరంగా తన గురువును సేవించి పుణ్యం కట్టుకోవాలి. పుణ్యంలేనిదే సిద్ధి లభించదు

304. సాధువులు అందరి శ్రేయస్సు కోరుతారు.

305. సత్సాంగత్యం లాంటి అమూల్యమైనది వేరొకటిలేదు. సత్సాంగత్యం వల్లనే అనేక జన్మలకు దొరకని ఉత్తమజ్ఞానం దొరుకుంది.

306. .........

307. ఈ త్రిలోకాల్లోను సారగర్భితమైనది సుఖదాయకం అయిన ధర్మం ఇదే. దీన్ని ఆచరించుటచే మానవజన్మ సార్థకం అవుతుంది.

308. వ్రతాచారపరుడు పట్టుదల అనే పదునుగల కత్తిని విడువనంతవరకు దేవతలు,రాక్షసులు, పిశాచములుకూడా అతనంటే భయపడతాయి.

309. అనేక నీటి బిందువుల సహాయంతో మహానది సముద్రాన్ని చేరుకున్నట్లు బుద్ధిమంతులు కొద్దికొద్దిగా పుణ్యాన్ని ఆర్జించాలి.

310. ధర్మం సుఖానికీ, అధర్మం దుఃఖానికీ మూలం. ఈ రహస్యం తెలుసుకుని ధర్మాన్ని సేవించండి. అధర్మానికి దూరంగా వుండండి.

311. ముముక్షువు లభ్యమయ్యే వస్తువులపట్లకూడా అనాసక్తి ప్రదర్శిస్తాడు.

312. మహాపురుషుల సంతతికూడా మహాపురుషులే అవుతారు.

313. మర్యాదను ఉల్లంఘించిన వారిని రాజు శిక్షిస్తాడు.

314. మహాపురుషుల నడవడికయే ఇతరులకు ఆచారమౌతుంది.

315. గురువాజ్ఞను శంకించుట కులీనునికి సమంజసంకాదు.

316. సర్వప్రాణులపట్ల కరుణభావాన్ని చూపడం మహాపురుషులకు న్యాయం.

317. మహాత్ములు నడిచేదే మంచి మార్గం.

318. దుర్జనుల పలుకులు వినబడని దేశమే ఉత్తమదేశం.

319. అపరాధి ఇతరులదోషాల్నే వెతుకుతుంటాడు.

320. వీరభోగ్యా వసుంధరా.

321. వీరుల వయస్సుచూడరాదు. వారి శౌర్యమే మనకు కొలతబద్ద.

322. మహాపురుషుల ఉద్యమం వేయిరూపాల్లో వికసిస్తుంది.

323. మహాపురుషుల ముందుచేసిన యాచన, ఋషుల వాక్కు ఊరకే పోవు.

324. మహాత్ములు ఎట్టి పరిస్థితిలోను అసత్యమాడరు.

325. ధైర్యం, పరాక్రమంలేని వ్యక్తి పౌరుషం కపటమే.

326. ఇతరుల మేలుకోసం సజ్జనులు తమ పనినికూడా మధ్యలో విసర్జించుతారు.

327. శరణువేడిన వ్యక్తిని శత్రువుకు అప్పగించడం క్షాత్రధర్మం కాదు.

328. సమయం వచ్చినప్పుడు ఏదైనా శోభిస్తుంది.

329. విశ్వశ్రేయస్సు కోసం మహాపురుషులు జన్మిస్తారు.

330. కులీనుల ప్రతిన వృథాకాదు.

331. దైవం సాత్త్వికపురుషులకు అనుకూలంగా వుంటాడు.

332. మహానుభావులు సేవకుల్ని కూడా సత్కరిస్తారు.

333. భయంకర అస్త్రాల్ని ప్రయోగించే రణరంగంలో శౌర్యప్రదర్శన చేసినవాడే అసలైన వీరుడు. ఇంద్రియాలు చంచలంగా వుండే యవ్వనదశలో చేసిన తపస్సే అన్నిటికన్న శ్రేష్ఠమైనది.

334. డాంబికుల పాండిత్యం పల్లీయులముందు రాణిస్తుంది.

335. మహాపురుషులు ప్రాణాల్ని కూడా ఒడ్డి పరోపకారం చేస్తారు. ఇక వారి మాటల గురించి వేరే చెప్పాలా ?

336. పరిశుద్ధ మనస్సు కలవాని పలుకులు కూడ నిష్కళంకంగా వుంటాయి.

337. లోభివివేకం ఎక్కువసేపు నిలబడదు.

338. అపకారులపై దయ తలచే సజ్జనులు ఉపకారిపట్ల అట్లా వుండ రనడానికి ఆధారం కనిపించదు.

339. మానవుల్ని సాంసారిక జన్మమరణాదుల చెరనుండి విడిపించడానికి తీర్థంకరులు జన్మిస్తారు.

340. కాల ప్రవాహాన్ని గమనించి నడుచుకొనువాడే శ్రేష్ఠమైనవ్యక్తి.

341. ప్రతిపదార్థానికి అనంతమైన ధర్మాలున్నాయి. అలా భావించని పక్షంలో ఆ వస్తువును సిద్ధింప చేసుకోలేం.

342. దీపంనుంచి ఆకాశం వరకు వ్యాపించి వున్న అన్ని పదార్థాలు సమానమైన స్వభావంకలవి.

343. విద్వాంసులకు మకుటాయమానమైన ఓదేవా! నీవు అనేకాంత రూపాలనే అమృతాన్ని గ్రోలి ప్రతివస్తువుసూ నిత్యము, అనిత్యము సదృశం, అనదృశం, వాచ్యము, అవాచ్యము, సత్, అసత్ అనే అనేక రూపాల్లో మలిచావు.

344. రాగద్వేషాది మనోవికారాలు కలుగక పోవడమే అహింస. అవి కలుగడమే హింస అని జైన శాస్త్రాల సారాంశం.

345. సమ్యక్ శ్రద్ధ, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ ఆచరణ — ఈ మూడు మణికాంతులతో ఆత్మను ఎల్లప్పుడూ తేజోవంతంగా వుంచాలి. దానం, తపస్సు, జినేంద్రోపాసన, విద్యావృద్ధిని పెంపొందించు కుంటూ జైనధర్మ మాహాత్మ్యమును విస్తరింప జేయాలి.

346. ఆత్మలేని ద్రవ్యాలపట్ల మునుల దృక్పథం విముఖంగానూ అలౌకి కంగాను ఉంటుంది.

347. కవ్వంత్రాటిని ఒకచేతితో గట్టిగా లాగుతూ మరోచేతితో జార విడిచి గొల్ల వెన్నతీసినట్లుగా బుద్ధిశాలి వస్తువుకుండే అనేక రూపాల్లో ఒక రూపాన్ని గ్రహిస్తూ ఇతర రూపాలపట్ల ఔదాసీన్యాన్ని ప్రదర్శిస్తూ ఆవస్తువు సమ్యక్ నిరూపణ చేయాలి.

348. దానం చేయువానికి ఏడు సుగుణాలు వుండాలి —

1. ఈ లోకంలో ఏ ప్రతిఫలాన్ని ఆశించరాదు. 2. ఓర్పు. 3 నిష్కపటం. 4. ఈర్ష్యలేకుండుట. 5. హర్షము. 6. ఖిన్నత్వంలేమి 7. నిరభిమానిగా వుండుట

349. క్షమ, మార్దవం, ఋజుత్వం, పవిత్రత, సత్యము, నిర్ధనత్వము, బ్రహ్మాచర్యము, త్యాగము, తపస్సు, నిగ్రహము— ఈ పదిరకాల ధర్మాల్ని పాటించాలి.

350. మృదుత్వము, క్షమ, సంతృప్తి మొదలైన భావనలద్వారా ఎప్పుడూ ధర్మాన్ని అభివృద్ధి చేయాలి.

351. నగరాన్ని దానిచుట్టూ త్రవ్విన కందకం రక్షిస్తున్నట్లు అహింసాది వ్రతాల్ని సదాచారం రక్షిస్తుంది

352. వ్యావహారిక దృక్పథం, శుద్ధ శాస్త్రీయ దృక్పథం— ఈ రెంటిని ఎరిగినవారే పుణ్యతీర్థాల ప్రవర్తకులనిపించుకుంటారు.

353. వ్యావహారిక దృక్పథం, నిశ్చయాత్మక దృక్పథం ఈ రెండు దృక్పథాలతో వస్తువుయొక్క నిజమైన రూపాన్ని తెలుసుకుని మధ్యస్థుడై సమతాభావాన్ని ప్రదర్శించు జీవియే ఉపదేశాల ఫలితాన్ని సంపూర్ణంగా పొందుతాడు.

354. కేవలం వ్యావహారిక దృక్పథాన్ని అనుసరించు వానికి ఉపదేశం ఇచ్చే పద్ధతి లేదు.

355. వివిధ దృక్కోణాలనుండి వస్తుస్వభావాలకు మధ్య వుండే వైరుధ్యాన్ని ఉపశమింపజేయు అనేకవాదుడైన జినేంద్రుడు నమస్కార్హుడు.

356. సర్వజ్ఞుడు, విరాగి ఐన ప్రభువు సకల వస్తువులకు వివిధ స్వభావాలని వచించాడు.

357. స్వానుగ్రహం, పరానుగ్రహం కోసం అతిథి కొరకు కొంత భోజనాదులు తీసి వుంచాలి.

358. జీవుల ధనాది వస్తువులను అపహరించుట వారి ప్రాణం తీయుటయే,

359, అమితభారంచే మహాసముద్రంలో నౌక మునిగిపోయినట్లు పరిగ్రహం కల జీవి సంసారసాగరంలో మునిగిపోతాడు, అందుచే పరిగ్రహాన్ని పరిత్యజించాలి,

360. పరిగ్రహంలో "త్రస" అణువులు అనే సుగుణాలు మాత్రమే కాదు. పర్వతాలంత పెద్ద పెద్ద అవగుణాలు కూడా వుంటాయి.

361. సంతృప్తి పరుడు, నిర్భయుడు పొందిన సుఖం అసంతృప్తి కలవాడు, చక్రవర్తి అయినాసరే దేవేంద్రుడైనాసరే, పొంద లేడు.

362. రాత్రులందు చీకటి మూలంగా భోజన పదార్థాల్లో సూక్ష్మ జీవులు పడినా కానరావు. అలాంటప్పుడు రాత్రి భోజనం చెయ్యాలని ఎవరు కోరుకుంటారు ?

363. బ్రహ్మచారి ఎక్కువగా నిద్రపోరాదు.

364. శ్రావకునికి జినేంద్రుడు దైవం. దయ ధర్మం. సాధుజనులు గురువులు. అలాంటి శ్రావకధర్మాన్ని ఎవరు ప్రశంసించరు ?

365. క్రోధావేశుని కోపం అవతలవాణ్ణి దహించినా, దహించక పోయినా అందరికంటె ముందు అతణ్ణే దహించి వేస్తుంది.

366, ప్రపంచానికే ఆధారమైన భూమి ఏ ఆధారం లేకుండా వుంది, అలా వుండగలగడానికి కారణం ధర్మాలే,

367. విషయవాంఛలంటే విముఖుడూ సమతాభావ చిత్తుడూ అయిన సాధకుని మనోవికారాలనే అగ్ని శాంతిస్తుంది. అతనిలో జ్ఞాన దీపం దివ్యకాంతుల్ని వెదజల్లుతుంది.

368. వన్నె తక్కువకల బంగారం నిప్పులో కరిగి నిర్మలత్వాన్ని పొంది నట్లు తపస్సనెడి అగ్నిలో తపించిన జీవి పరిశుద్ధదశను చేరు కుంటాడు.

卐